# సంస్థానాధిపతుల కేలమాజోలి?

## మా హెచ్చరిక విననిచో, వారితోను పోరాడెదము

### ఫెడరేషన్ విషయములో కాంగ్రెసు కర్తవ్యము

తసుళినాడు రాజకీయ మహాసభలో ముత్తురంగ మొదలియారుగారి అధ్యక్షోపన్యాసము

మధుర జిల్లాలోని బట్లగుంటులో ౧౯ జనవరి నాడు సమావేశమైన ౩౯ వ తమిళనాడు రాష్ట్రీయ మహాసభ కధ్యక్షతవహించి ఉపన్యసించుచు భారత కేంద్ర శాసనసభయగు అసెంబ్లీలో సభ్యులగు బి యస్ ముత్తురంగ మొదలియారుగారు ఫెడరేషను గూర్చి ఇట్లుపన్యసించిరి —

మాకు వద్దోయని మొత్తుకొనుచున్నను ఈ ఫెడరేషను బ్రిటిషు ప్రభుత్వమువారు మన తలల కంటగట్టి మన అభివృద్ధి కాటంకములను గల్పించుచున్నారు మనము ఫెడరేషనును భగ్నముచేయుటయే వారితో పోరాటమగును ఫెడరేషనులో చేరుటకు ఒప్పుకొని, బ్రిటిషు వారికి తోడ్పడుచు, సంస్థానాధిపతులు స్వాతంత్ర్యమునకై చేయబడుచున్న ఈ పోరాటములో తామెందుకు చేరవలెను? ఈ ఉద్యమమునకు వారలు దూరముగా తొలగియుండుటయే మంచిపద్ధతియగును. వారలీమాటవిననిచో మనము వారలతోగూడ పోరాడగలము. ఫెడరేషను, మనమెంత వలదనుచున్నను స్థాపించుచో మనము ఆ ఫెడరేషను నిరాకరించు మార్గమునుగూర్చి ఆలోచించవలసియుండును. కాంగ్రెసు ఫెడరలు శాసనసభలో సభ్యస్థానములను ఆక్రమించుకొని అభివృద్ధి ప్రతికూలురు వాటికి చేరకుండ చూడవలెను కాని ఫెడరలు పద్ధతిలో ప్రభుత్వవిభాగమును మనము నిస్సంశయముగ నిరాకరించవలసి యుండును రాష్ట్రీయ స్వపరిపాలన క్రింద ప్రభుత్వాధికారము స్వీకరించుటకును, ఫెడరేషను క్రింద అట్టి అధికారమును స్వీకరించుటకును ఎంతో భేదము గలదు,"

# బ్రిటను, ఐర్లెండు దేశ ప్రభుత్వములమధ్య సామరస్య ప్రయత్నములు

లండన్ జన ౧౯

బ్రిటను, ఐర్లెండు ప్రభుత్వములమధ్య సమరసంబంధములను స్థాపించుటకై బ్రిటిషు ప్రధానమంత్రి నెవిల్ ఛేంబర్లేన్ గారు ప్రయత్నించుచున్నారు. ఐర్లెండునుండి కొందరు ప్రతినిధులు ఇచటికి వచ్చియున్నారు. వారల కడపటి సమావేశము నేటి మధ్యాహ్నము జరిగెను ఐర్లెండుయొక్క ఐకమత్యమునకై ఏదైన సౌకర్యమును పొందుటకు అందరును నిశ్చయించుకొనిరి. బ్రిటిషు ప్రతినిధులు ఐరిషు ప్రతినిధులతో సంభాషించుటకు కడపటి సన్నాహములు ఈ వారములో చెకర్సునందు పూర్తి చేయబడెను.

"దాటవలసిన చిక్కులనేకము లున్నవి. ఐరిషు ప్రతినిధులమట్టుకు, మేము రెండు దేశముల జనులమధ్య మైత్రి ఏర్పడుటకు పునాది ఏర్పడవలెనని ఎంతో కోరుచున్నాము" అని డివలెరాగారు చెప్పిరి.

# సింధు ఖైదీల ఆహారము

## సంస్కరణ ప్రణాళిక అంగీకారము

కరాచి జనవరి ౧౯

ఆరోగ్య, జైలుశాఖల అధ్యక్షుల చే ప్రతిపాదింపబడిన జైలుసంస్కరణల ప్రణాళిక ఆరోగ్య శాఖామంత్రుల ఆధ్యక్షతక్రింద సమావేశమైన జైలుసంస్కరణల సంఘసమావేశమునందు అంగీకరింపబడినది

ఈసూచనల ననుసరించి జేళ్లయందు, సబు జేళ్లయందును, లాకప్పులయందునుగల ఖైదీలందరిని ముందునుండి వరిఅన్నము, మాంసము, చల్ల యొసగబడును. ఇందుకై రూ౧౧-౨౦౦లు అంగీకరింపబడినది.

జొన్నఅన్నమునకు బదులుగా వారమునకు రెండుసారులు వరిఅన్నము ఖైదీలకొసగబడును యొసగబడును చల్ల ఎండకాలమున దుమాత్రము యొసగబడును ఖైదీలకు గాంధి గారి జన్మదినము నాడు, క్రిసుమసులో దీపావళి మొదలగు పండుగదినములలో మధురపదార్థములు, పండ్లు యొసగబడును.



# పైల్వానుల పోటీ

ప్రొ. లక్ష్మీనారాయణగారు ప్రొ. అన్సారీగారిని ఓడించుట

హైదరాబాదు జన ౧౮

నేను సాయంకాలము నైజాం కాలేజివద్ద సవాలుచేసిన ప్రొఫెసర్ జాఫర్ అన్సారి గారికిని, ప్రొఫెసర్ వి లక్ష్మీనారాయణ గారికిని కుస్తీ పోటీలుజరిగెను నైజాం కాలేజి ప్రిన్సిపాలు టర్నరు గారు అధ్యక్షత వహించిరి చాలమంది చూడవచ్చియుండిరి నవాబు బహదుర్యార్జంగ్ బహదురు గారును, పండిత వినాయకరావుగారును, కె యస్ వైద్య, బి ఏ, బి ఎల్., యం. యల్. సి. గారును పరీక్షకులుగా నుండుటకు కోరబడిరి

ప్రొఫెసర్ జాఫర్ గారు ౨౫ అంశములకు ప్రయత్నించెను. అందులో మూడింట మాత్రమే గెలుపొందెను. కాని, వాటిఅన్నిటిలో లక్ష్మీనారాయణగారు వారిని కొట్టివేసిరి. లక్ష్మీనారాయణగారంత అనేకములైన అంశములను చూపెదననెను కాని మూడింటిని మాత్రమే చేయుట కనుమతినిచ్చిరి. వాటి అన్నిటిలోను ప్రొఫెసరు అన్సారి గారే ఓడిరి అవిగాక మరికొన్ని అంశములను లక్ష్మీనారాయణగారు చూపిరి. అవిచాలమంది మెచ్చుకొనిరి.

ప్రొఫెసరు జాఫరు అన్సారి ఒక గట్టిత్రాటిని త్రెంచెను దానిని ప్రొఫెసర్ లక్ష్మీనారాయణగారు చాల సులువుగా త్రెంచిరి ప్రొఫెసర్ అన్సారి ఒక ఇనుపకడ్డీని వంగులగొట్ట యత్నించి విఫలుడయ్యెను. గుజ్జుపులావును నొకదానినికూడ వంగులగొట్టలేకపోయెను ఱొమ్ముపై బరువులనుంచుకొని వాటిపై సుత్తెలతో గొట్టించుకొను పనినికూడ అన్సారిగారు చేసిరి ఇందులో జయముపొందిరి. ఱొమ్ముపై బరువులుపెట్టినపుడు అన్సారిగారు రెండు కుర్చీలతో చేయబడిన ఒక బ్రిడ్జిపై పండుకొనిరి లక్ష్మీనారాయణ గారిదియు చేయగలిగిరి మరియు వారు బ్రిడ్జిలేకయే రెండుటన్నుల బరువును ఱొమ్ముపై పెట్టించుకొని సుత్తెతో కొట్టించుకొనిరి ఇంకొకటి ఒకరినొకరు ఎత్తుకొనుట ఇది వ్యర్థమని నిర్ణేతలచే మానివేయించబడెను.

లక్ష్మీనారాయణగారు చూపినవాటిలో మొదటిది కాళ్లపైనను, నోటిలోను పెద్ద బరువులుపెట్టుకొని భుజముపై దృఢగాత్రుని నొకరిని ఉంచుకొని రెండు చుట్లు తిరిగివచ్చుట యొకటి. అన్సారీగారిది చేయలేకపోయిరి. లక్ష్మీనారాయణ గారును గట్టి ఇనుపగొలుసు నొకదానిని త్రెంపిరి, అన్సారి గారిది చేయలేకపోయిరి ఱొమ్మున బరువునుంచుకొని ఉపన్యసమిచ్చుట మూడవది ఇదియు అన్సారిగారు చేయలేకపోయిరి.

రూపాయను వ్రేళ్లతోవంచుట, నిమ్మకాయను వ్రేళ్లమధ్య కత్తిరించుట, కాలుకతో సోడానీసామూత తెరచుట, ఇనుపకడ్డీలతో గొంతు పిసికికొనుట ఇవి లక్ష్మీనారాయణగారు అదనముగా చేసినవి

లక్ష్మీనారాయణగారు గెలిచినట్లు ఏకగ్రీవముగా నిర్ణయించబడెను.

# దరిద్ర ఋణగ్రస్త వ్యవసాయకులకు సంరక్షణము

బొంబాయి ప్రభుత్వమువారు నిశ్చయించిన విధానము

బొంబాయి జన ౧౮

బొంబాయి ప్రభుత్వమువారు తమ రాష్ట్రమండలి దరిద్రఋణగ్రస్త వ్యవసాయకులకు సంరక్షణనొసగుటకై రెండుశాసనములను ప్రతిపాదింప తలపెట్టియున్నారు ఒకటి తాత్కాలికోపశాంతి నొసగుటకై ఉద్దేశించబడినది. తర్తీయొనచో అయిదు ఎకరములు ఖుష్కీయైన చో ౧౫ ఎకరముల భూమిగల చిన్నచిన్న వ్యవసాయులు అదివరకు తీసికొనిన అప్పులను ౩౧ మార్చి ౧౯౩౯ వరకు ఒక సంవత్సరకాలము చెల్లించవ నిన నిర్బంధము లేకుండునట్లు చేయబడును శాసనము అమలు లేనివారు అట్టి వ్యవసాయకుల భూములనుఅమ్మి బాకీలను రాబట్టుకొనుటకై పొందబడి అమలు పరచబడక యున్నట్టి డిక్రీని గాని లేక అమలు లేదితర్వాత పొందబడినట్టి డిక్రీని గాని అమలు పరచరాదని దరఖాస్తుపెట్టినచో, అదరఖాస్తు ప్రకారము అమలుపరచబడదు ఆ సంవత్సరకాలములో ముందుగా జిల్లా అధికారి అనుజ్ఞలేక భూమిని అమ్మరాదు ౩౦ జూను ౧౯౩౭ నాటి కీయవలసిన మక్తాను సంపూర్ణముగ చెల్లించివేసిన రైతును ఆ సంవత్సరకాలములో భూస్వామి తొలగించరాదు.

ఇంకొకశాసనము అప్పిచ్చువారలను కట్టుదిట్టములోనుంచుట కుద్దేశించబడినది ఈశాసనముచే వడ్డీవ్యాపారము చేయువార లందరిపేర్లను రిజిస్టరుచేయబడును అందుకు ఫీజు ఒక్కొక్కరి వ్యాపారపరిమితిని బట్టియుండును. మరియు ఎప్పుడుగాని వడ్డీ అసలుకంటె మించి కనూలు చేయరాదని నిర్ణయించబడినది వడ్డీ గిర్వీలేని అప్పులకైనచో ప్రతిశత ౧౨ వంతునను, గిర్వీ యున్నవాటికైనచో ప్రతిశత ౯ వంతునను ఉండునట్లు ఏర్పాటు చేయబడినది

# డోర్నకల్ డయోసిసన్ మద్య నిషేధప్రచారము

(గోలకొండ ప్రతినిధి)

డోర్నకల్ జనవరి ౧౯

ఇటీవల సమావేశమైన డోర్నకల్ డయోసిసన్ కౌన్సిలు సమావేశమునందు ఈడయోసిసు (నిజాము పరిపాలిత ప్రదేశము) నందుగల చర్చి పెద్దవైనంతవరకు నరుసగా మద్యపాన నిషేధమును వ్యాప్తిలోనుంచుటకు కృషిసలుపుచున్నది కావున ౧౯౩౭ సంవత్సరమద్య నిషేధశాసనమును అచరణలోనికి తెచ్చినందులకు మదరాసు ప్రభుత్వమువారిని ప్రశంసించుచు ఒక తీర్మానము అంగీకరింపబడెను. ఈతీర్మానమునందు మద్యపాన దురభ్యాసమును పారద్రోలుటకై గావించు ప్రభుత్వ ప్రయత్నములందు తమ సంపూర్ణ సహకారముండునని విశ్వాసమొసగబడెను.

మరియొక తీర్మానమునందు సాధ్యమైనంత త్వరలో జిల్లాఅందు—ఈడయోసీసు ప్రాంతముతో సహా—మద్యనిషేధము నాచరణలోనికి తేవలయుననియు, ఇట్టి సంస్కరణలు సిద్ధపరచుటకు చర్చివారు ముఖ్యభాగమును గైకొనవలయుననియు సూచింపబడెను ఈ ఆశయమునెరవేరుటకై డీనరీలోను మద్య నిషేధసంఘములు స్థాపింపబడి, మద్యపానముయొక్క ప్రజలకు విరోధభావములనుగలిగించి వారిని ప్రోత్సహించుటకు పాస్టరులు విధానముల నవలంబించవలయునని డీనరీసంఘములవారు కోరబడిరి

ఇంతేగాక ఇట్టి మద్యనిషేధసంఘములందు సాధ్యమగునప్పుడెల్లనిటిలోను క్రైస్తవేతర వర్గములవారిని సభ్యులుగా చేర్చుకొనవలయునని కౌన్సిలువారు సూచించిరి.





# దక్షిణ చీనా ముట్టడి

హాంకాంగ్ జనవరి ౧౯

చీనాకు దక్షిణమునగల క్వాన్టైస్ యందు నున్నారు ౫౦౦ జపాను సైనికులు, మరఫిరంగులు, విమానములు, మారణాస్త్రములతో చేరి చీనావారు సహాయక సైన్యమును రంగమునకు బంపిరి. హాంకాంగునుండి సుమారు ౮౦ మైళ్లు దూరమునగల పోర్చుగీసు అధీనప్రాంతమునకు సమీపమునగల మగాల్ వలి ప్రాంతమునందు జపానువారి సైన్యము రేవునకుదిగినవి వెంటనే వీరు టాంగ్వీకాన్ గ్రామమును ఆక్రమించుకొనిరి ఇది కఱయొటునేని జపానువారి సామ్రాజ్య సైన్యము దక్షిణచీనాముట్టడికి ఆరంభించినటుల భావింపబడుచున్నది.

